# చిద్విలాసలింగ చిన్మయాంగ

## ఓం "గం" గణాధిపతయే నమ:

శ్రీరమావిభునిచె సేవగొనుచెపుడు
వాక్పతివరుసెరిగి వరమునొసగి
విశ్వమునకునీవు వింతశక్తొసగేవు
చిద్విలాసలింగ చిన్మయాంగ 1

నీవునాలొనిలచి నిజమునుతెలుపుచు
నిన్నెరుగగ శక్తినీయుమయ్య
నీలొనన్నునిలిపినిత్యునిజేయుము
చిద్విలాసలింగ చిన్మయాంగ 2

సిరిగిరినడుమనవసించినావుతిరిగి
తిరిగి చెంచుజనుల తీరునెరిగి
నాగరికులకులపు నటనమెరుగుదీవు
చిద్విలాసలింగ చిన్మయాంగ 3

నిజము భక్తజనుల నియతినెరుగుచెప్డు
నిత్యపూజలందినీతిదెలిపి
నిరతముజనమనమునిర్మలమొనరించు
చిద్విలాసలింగ చిన్మయాంగ
4

జన్మనిచ్చినావుజగతిరీతినిజూపి
జనులమనసునెరుగచదువునిచ్చి
జన్మజన్మలందుజరిగినవవితెల్పు
చిద్విలాసలింగ చిన్మయాంగ 5

పండ్లబరువుచేతపాదపమ్మొంగును
కంకిబరువుచేతకాడవంగు
విద్యబరువుచేతవిద్వాంసుడొంగును
చిద్విలాసలింగ చిన్మయాంగ 6

కాస్తకూస్త రాసికన్నుగానకయుండు౧
పిట్టకలమువారుపిల్లకవులు
యెగురగలదెపక్షిరెక్కలుపెరుగక
చిద్విలాసలింగ చిన్మయాంగ 7

వయసుతోడవచ్చు వన్నెలన్నియుచూడ
బుద్ధితోడవచ్చుపుణ్యమంత
వయసుబుద్ధులందువయసుగొప్పదగునె
చిద్విలాసలింగ చిన్మయాంగ 8

చదువుయుండికూడచవటయౌనొక్కడు
ధనముయుండికూడతనియడొకడు
స్థిరముగుండుదానిచింతజేయరెవరు
చిద్విలాసలింగ చిన్మయాంగ 9

వాణిమెచ్చియతనివాప్రతిచేయ–ా
జాతికులములనెడిచర్చయేల
ఋషులజన్మలందుఋజువులుచూడగ
చిద్విలాసలింగ చిన్మయాంగ 10

బ్రాహ్మణులనబ్రహ్మవాదులేగాకున్న
బ్రహ్మముఖమువారి పట్టుయగునె?
బ్రాహ్మలంతనేడుబ్రష్టులయిరిచూడ
చిద్విలాసలింగ చిన్మయాంగ 11

అగ్రవర్ణమంతయడుగంటిపోవగా
నిమ్నవర్ణమంతనిక్కిపెరిగె
అడ్డదారినడచునగ్రవర్ణమదేల
చిద్విలాసలింగ చిన్మయాంగ 12

గోచి పెట్టి నుదుటకొమ్మరైనబొట్టెట్టి
నోటికొచ్చునాల్గునొనరజెప్ప
బ్రాహ్మడేలయగును బ్రష్టుడయినవాడు
చిద్విలాసలింగ చిన్మయాంగ 13

కోడిలేకకూడునోటిలోనికిపోదు
సారలేకనాటిసంధ్యలేదు
బ్రహ్మవాదికిన్నిబ్రష్టుపనులుయేల
చిద్విలాసలింగ చిన్మయాంగ 14

ఏమిలేనివాణ్ణియెడ్డినాకొడుకండ్రు
యన్నియున్నవాడె యందగాడు
అన్నియనగనడ్డదార్లన్నిదెలియుటే!
చిద్విలాసలింగ చిన్మయాంగ 15

దుడ్డుచెతనున్నదొడ్డవాడందురు
దుడ్డులేనివానిగొడ్డుయండ్రు
పిట్టజూచివేయుపీటననిదియె
చిద్విలాసలింగ చిన్మయాంగ 16

జగమునందుయున్నజరుగుకాలమునందు
తలువవలయునెపుడుతండ్రిపేరు
తండ్రిబాధ్యతేమొ తనుతెల్సుకోవలె
చిద్విలాసలింగ చిన్మయాంగ 17

గడ్డిపరకగానిగుడ్డిగవ్వయుగాని
సమయమొచ్చినపుడుసరకుతెలియు
చిన్నవార్నిజూచిచిందులేయవలదు
చిద్విలాసలింగ చిన్మయాంగ 18

చదువులెంతొబలిసిజాగరూకతతగ్గె
వేగమదియుపెరిగివెట్టిబలిసె
చదువు వేగమనగ చర్మచక్షువులదా?
చిద్విలాసలింగ చిన్మయాంగ 19

మనిషిపుటుకబుట్టిమంచితల్పకయుండు
కానవచ్చునంత కాంక్షజేయు
మనిషిబతుకుకన్న మానునయముగాదె
చిద్విలాసలింగ చిన్మయాంగ 20

రాజులేనిరాత్రిరంజిల్లదెప్పుడు
భర్తలేనిభార్యబ్రతుకుబరువు
తల్లిలేనిసంతుతరిగిపోవునెపుడు
చిద్విలాసలింగ చిన్మయాంగ 21

మంత్రిగారిమాటమంత్రమ్ములాగుండు
ప్రజలెయిచ్చెమంత్రిపదవిజూడ
పదవిచేతికిచ్చిపాదాలుపడ్తిరే
చిద్విలాసలింగ చిన్మయాంగ 22

డబ్బులున్ననాడుడాబులన్నియుచెల్లు
డబ్బులొడిసినంతడస్సిపోవు
డబ్బుతోనెజగముడాస్సింగుజేయును
చిద్విలాసలింగ చిన్మయాంగ 23

తనకుపుట్టినట్టితనయులజూడక
స్వార్థబుద్ధితోడసాగునేని
పోల్చలేమువారుపోవుజగతదేదొ
చిద్విలాసలింగ చిన్మయాంగ 24

స్వేచ్ఛ కోరునరుడుయిచ్ఛతోడతనునిట
మోహజలధినందుమునిగియున్న
స్వర్ణనిగళమందుసమసిపోవునువాడు
చిద్విలాసలింగ చిన్మయాంగ 25

ఆలుపిల్లలంచుయలమటించుచునుండి
కాలమంతయిచటగడుపుచున్న
పరముమీదచింతపట్టువడకయుండు
చిద్విలాసలింగ చిన్మయాంగ 26

నిన్ననాదె నాదెనేడుకూడ ననుచు
రేపుకూడనాదెయెపుడు కూడ
చావువచ్చినపుడుకావునెయూహలు
చిద్విలాసలింగ చిన్మయాంగ 27

తనయుపెంపుగోరుతండ్రితండ్రియెగాని
తనయుసేగిగోరుతండ్రితండ్రె?
పశువులైనగోరుపసిదానిక్షేమము
చిద్విలాసలింగ చిన్మయాంగ 28

ఆలితెచ్చియిచ్చుయర్థంబుతోడుత
బ్రతుకునీడ్చువాని బ్రతుకు బ్రతుకె?
పక్షి,పశువులైన పాటుపడుచునుండు
చిద్విలాసలింగ చిన్మయాంగ 29

ఆడదానిసొమ్మునాశతోడుతపొందు
నరుని జీవమందునాణ్యతేది?
పురుషునిగనువాడుపుట్టుటెందుకిలలొ
చిద్విలాసలింగ చిన్మయాంగ 30

కష్ఠపడనివాడుకామించనెక్కువ
యిష్టపడినదంతనష్టపోవు
శ్రమయెజీవనంపుశాంతినిచేకూర్చు
చిద్విలాసలింగ చిన్మయాంగ 31

కామమదియుపెరిగికన్నుగానకయుండి
కన్నకూతునైనకట్టివేసి
తృప్తినొందునరునియాప్తినరకమండ్రు
చిద్విలాసలింగ చిన్మయాంగ 32

కన్నవారిబాగునెన్నగానేరని
తల్లిదండ్రులన్నతలపులేల
సంతుబెంపుగోరుశాంతమూర్తియెతండ్రి
చిద్విలాసలింగ చిన్మయాంగ 33

కష్టకాలమందుయిష్టపూర్తిగతాము
నిష్ఠ తోడసల్పు నిష్ఠినంత
కష్టముడిగినంత కానరుదేవుని
చిద్విలాసలింగ చిన్మయాంగ 34

ఈశు దేసు డల్ల యూసులన్నియుకూడ
ఈసు బెంపుజేసెయిలనునిపుడు
నామభేదమదియెనరసిజూడగవింత
చిద్విలాసలింగ చిన్మయాంగ 35

మతములెన్నియైనమమతరూపమొకటె
బుద్ధిలేని నరుడు పోరునెపుడు
పశువులెన్నియైనపాలరూపమొకటే
చిద్విలాసలింగ చిన్మయాంగ 36

పుట్టినపుడు ప్రాణిపుడమి నొంటరిగొచ్చు
చచ్చునపుడుకూడ్జరుగునదియె
మధ్యవచ్చినట్టి మాయజాలమిదియె
చిద్విలాసలింగ చిన్మయాంగ 37

లంజచేష్టలన్నిలాంగూలచేష్టలె
న్యాయవాదిమాటమాయయెపుడు
వైశ్యచెలిమికన్న వేశ్యయేమిన్నగు
చిద్విలాసలింగ చిన్మయాంగ 38

విద్యవిలువనెరుగువిజ్ఞానవేత్తలు
భోగిలక్షణంబు యోగియెరుగు
రాగలక్షణంబురాజుయెరుగునయ్య
చిద్విలాసలింగ చిన్మయాంగ 39

విత్తమందుబుద్ధి విడువకనరులుండు
మోక్షవిత్తమందుకాంక్షలేక
పరమునందుధనముపనికివచ్చునటయ్య
చిద్విలాసలింగ చిన్మయాంగ 40

నీదుపాదసేవనిధినినేకోరుదు
తరగకుండదాన్నితగనుయిమ్ము
మరలజన్మమసలు మరలిరాకుండగా
చిద్విలాసలింగ చిన్మయాంగ 41

తల్లియిచ్చుతనువుతండ్రిసంస్కారమ్ము
గురువుయిచ్చునరులగుహనదీప్తి
భార్యయిచ్చుసంతుభావించిచూడగా
చిద్విలాసలింగ చిన్మయాంగ 42

శుభముకలుగజేయుశూరుండవీవయ్య
శక్తియిచ్చునీదుభక్తియెపుడు
నాదు చిత్తమెపుడునీదుపాదములందె
చిద్విలాసలింగ చిన్మయాంగ 43

వేశ్య పతిసేవ విలువజూడగవింత
వైశ్య మిత్రతత్వమరయవింత
గార్ధబంపుకంఠగానమహిమవింత
చిద్విలాసలింగ చిన్మయాంగ 44

అర్థమిపుడునిన్ను యర్థించినానయ్య
బంధ మోక్షమిచ్చి బాధబాపి
అభయహస్తమిచ్చి యాత్మబలమునుమ్మ
చిద్విలాసలింగ చిన్మయాంగ 45

ఊరికొక్కలోభియుండగావలయును
ధనమువిలువతెలియధరణిజనులు
లోభికూడజూడలోకోపకారియె
చిద్విలాసలింగ చిన్మయాంగ 46

అతిచనువదెపుడుయశ్రద్ధగలిగించు
బీదతనమునెపుడుభీరుజేయు
ఆత్మబలములేకయడుగంటుమనిషెప్డు
చిద్విలాసలింగ చిన్మయాంగ 47

అణువుకన్నచిన్నపరమాణువనియండ్రు
అందులోనెయుందియందమంత
అందమొకటియేన?యమరెప్రళయమంత
చిద్విలాసలింగ చిన్మయాంగ 48

అవసరమునుబట్టియార్జించిబెట్టుచో
చివరికాలమందుచింతలేదు
వొరులనమ్మియున్ననోడిపోదురుగాదె
చిద్విలాసలింగ చిన్మయాంగ 49
తల్లిదండ్రిమించుదైవంబులేదయ్య

గురువుకన్ననెవరుగుర్తుజూపు
ధర్మమార్గమెపుడుతప్పకయున్నచో
చిద్విలాసలింగ చిన్మయాంగ 50

కూడుగుడ్డగూడుకుదురుగనున్నచో
చింతలేదుమనిషిజీవితాన
అంతకన్నమించియాశపనికిరాదు
చిద్విలాసలింగ చిన్మయాంగ 51

సర్వజీవులందుసమహితతత్వంబు
కలిగియున్ననరుడుకక్షవీడు
కలిగిలేనినరుడుకానడుయెవరిని
చిద్విలాసలింగ చిన్మయాంగ 52

గేస్తుధర్మనిరతి గృహగౌరవమ్మయా
యాలియణుకువెప్డు యాదరంబు
శిష్యభక్తినిరతి శిష్యులపుష్ఠయా
చిద్విలాసలింగ చిన్మయాంగ 53

ధనముకలుగువారుధాన్యంబుకలుగువారు
విఱ్ఱవీగుచుందు౯బొజ్జపెంచి
కాలపురుషుపట్టుకానగలేకుండ
చిద్విలాసలింగ చిన్మయాంగ 54
రంకునేర్చువాడురాజకీయమునడ్పు
బొంకునేర్చువాడుబొజ్జపెంచు

రంకుబొంకులన్నరాచకీయులకేగ
చిద్విలాసలింగ చిన్మయాంగ 55

జలచరములకువనచరములకుకలుగు
మిషయు లేని మిత్తి విషపు టెరల
సాధుజనులపథమునందునకలుగిట్లు
చిద్విలాసలింగ చిన్మయాంగ 56

జీవభాషలోనిచేవయున్నపదము
లన్నికలిపిపద్యలక్షణమ్ము
వీడకుండలోకవిధినితెలుపుదును
చిద్విలాసలింగ చిన్మయాంగ 57

ధనమునందుయాశతగులుకొనుచుతాను
దేహమందెపుడునుతిరుగుచుండు
అసురశబ్దమునకుయర్థమిదియెకాద
చిద్విలాసలింగ చిన్మయాంగ 58

ఆట ,వేట,వనిత,పానంబు,బెడిదపు
పలుకు,కఠినశిక్ష,పనికిరాని
ఖర్చుననగనేడు కలుషగుణములగు
చిద్విలాసలింగ చిన్మయాంగ 59
కోర్కెలెన్నియున్నకోల్పోడుతెలివిని
యోర్పునేర్పుకలిగియున్నవాడు
కామితములకంతకారణమున్నచో

చిద్విలాసలింగ చిన్మయాంగ 60

నివురుకప్పునిప్పునిలిపినకోపము
నెపుడురగులజేయనపుడెరగులు
క్రోధికెపుడుకలుగుకోటికష్టములన్ని
చిద్విలాసలింగ చిన్మయాంగ 61

ఉన్నదానిలోనకొంతయితరులకు
యివ్వవలయువారునొవ్వకుండ
త్యాగిబతుకునిటులెసాగిపోవునెపుడు
చిద్విలాసలింగ చిన్మయాంగ 62

తనదుతప్పుతెలిసితగువిధినినడువ
మూడులోకములలొముఖ్యుడగును
తనదులోపమెరుగతగవులెట్లుండును?
చిద్విలాసలింగ చిన్మయాంగ 63

ఎఱనుజూచిచేపయెరుగదుమృత్యువు
ఆశతోడపడియెపాశమందు
దానిజూచియైనతట్టదేలనిజము
చిద్విలాసలింగ చిన్మయాంగ 64
భృంగమేలతేనెతాగప్రయత్నించు
పూలబతుకుకెపుడుచావులేక
అటులెనరుడుతనదుపలముపొందవలెను
చిద్విలాసలింగ చిన్మయాంగ 65

కల్లువలనకలుగుకన్నుగాననిబుద్ధి
క్షణికమగునుగానిగుణముగాదు
ధనమువలనకలుగుదంబమదియెపెద్ద
చిద్విలాసలింగ చిన్మయాంగ 66

మత్తుమందుయిచ్చుమదమదికొంచమె
ధనముయిచ్చుమదముతరుగదసలు
ధనముకరిగిపోవతరుగునుగర్వమ్ము
చిద్విలాసలింగ చిన్మయాంగ 67

ఆలు సంతు బంధుగణములుగొలుసులు
తగులుకొనకమునుపెతప్పుకొనుము
తగిలుకొనినపిదపతప్పుకొనుటముప్పు
చిద్విలాసలింగ చిన్మయాంగ 68

సేవ్యుచూపుయుండుసేవకునితలపై
సేవకునికియుండుసేవ్యుపదము
సేవ్యుసేవకులకుచేప్పుటెవరితరము
చిద్విలాసలింగ చిన్మయాంగ 69

శ్రద్ధయున్నచాలు చదువులన్నియువచ్చు
శ్రద్ధలేనినాడుచవటయగును
ధనముకులముబలముధరణిశ్రద్ధవలనె
చిద్విలాసలింగ చిన్మయాంగ 70

గుణముచేతమనిషిగురిచేతబుద్ధియు
అగ్నిచేతకనకమరయబడును
ఓర్పునేర్పుతోనఓజస్సుకలుగును
చిద్విలాసలింగ చిన్మయాంగ 71

ఇష్టులైనవారుదుష్టులయినగాని
జారులవనిమరియుచోరులవని
కప్పిపుచ్చివార్నికాపాడుచుందురు
చిద్విలాసలింగ చిన్మయాంగ 72

విద్యకోరువారువినయమ్మువీడక
తల్లిదండ్రిగురులతగనుగొల్చి
భిక్షమెత్తవలయుకాంక్షతీరువరకు
చిద్విలాసలింగ చిన్మయాంగ 73

కన్నతల్లివంటికల్పవృక్షములేదు
మంచిమనసుకన్నమమతలేదు
దయనుమించియుండుదాతృత్వమదిలేదు
చిద్విలాసలింగ చిన్మయాంగ 74

అరులబలముముందుయణిగున్నవారికి
నరకమెకలుగుగదనరసిజూడ
అరులకోడి కోర యందునామోక్షమ్ము
చిద్విలాసలింగ చిన్మయాంగ 75

పిల్లనిచ్చుచోటభిక్షమెత్తుచోట
భృతియుకలుగుచోటవృత్తినందు
ప్రశ్నలడగకున్నప్రఖ్యాతికలుగును
చిద్విలాసలింగ చిన్మయాంగ 76

ఋణముతెచ్చుచోటరణముకలుగుచోట
పుచ్చుకున్నచోటపూర్వమందు
మాటనిల్వకున్నమనుగడయేసున్న
చిద్విలాసలింగ చిన్మయాంగ 77

కన్యనీయవలయు కట్నమీయవలయు
కాంక్షతీరువరకుకాన్కలిచ్చి
యాశతీర్చవలయుయల్లుడనెడివాడ్కి
చిద్విలాసలింగ చిన్మయాంగ 78

అల్లుడనగనెవరుఅరగదీసెడివాడు
బిడ్డనడ్డుపెట్టి పీక్కుతినును
గేస్తుజీవనమును గేలిసేసెడివాడు
చిద్విలాసలింగ చిన్మయాంగ 79

అత్తమామలనెపుడుగౌరవించవలయు
వార్నితల్లిదండ్రివలెనుకనుము
యపుడెనరునిజీవితాననాణ్యతయుండు
చిద్విలాసలింగ చిన్మయాంగ 80

వియ్యమందువారివిలువచూడవలయు
కయ్యమందువారికాంక్షగనుచు
పీలుజూచినరుడుకాలుపెట్టవలయు
చిద్విలాసలింగ చిన్మయాంగ 81

పిల్లనిచ్చువారుపిరికివారైనచో
పీల్చిపిప్పిచేయుపెళ్ళివారు
భిక్షమెత్తువార్కిభీరములెందుకో
చిద్విలాసలింగ చిన్మయాంగ 82

కాపరమ్ముకొచ్చుకాలమందుసతికి
కట్టుబాట్లనన్నిగరపవలయు
వదురుబోతుయైనవదలవలెనుదాన్ని
చిద్విలాసలింగ చిన్మయాంగ 83

తనదులోప మెరిగి తగనుడువ నరుడు
తగవులేలయుండుధరణిలోన
తననుతానుమరచె ధరణినరుడిపుడు
చిద్విలాసలింగచిన్మయాంగ 84

మందిచూడపూజ మంచిగాజేయుచు
మదిన నిన్నువిడిచె మహిననరుడు
బాహ్యపూజలేలభావమందునలేక
చిద్విలాసలింగచిన్మయాంగ 85

తననుకోరివచ్చుదానినివిడువక
తననుకోరనట్టిదాన్నివిడిచి
తనువునిలుపవలయుధరణిపైననరుడు
చిద్విలాసలింగచిన్మయాంగ 86

నిజముపూడ్చిపెట్టు యిజముమాకసలొద్దు
మతినిచెడగొట్టుమతములొద్దు
మమతపంచిపెట్టుమానవత్వమెముద్దు
చిద్విలాసలింగచిన్మయాంగ 87

సూక్తులెన్నియైనచురుకుగాచెప్పొచ్చు
ఆచరించు నపుడు నరసిచూడ
చేతగానిమాటచెల్లనిరూపాయె
చిద్విలాసలింగచిన్మయాంగ 88

ముద్దుపేరుబెట్టిమురిపెముగనుబెంచి
బొట్టుబెట్టి గట్టిపట్టుబట్ట
నాతియనుచుబిల్వకోతినాతియగునా?
చిద్విలాసలింగచిన్మయాంగ 90

పాతగోడలన్నిపూతపూయగకొత్త
కొత్తగోడకన్నయెంతొమిన్న
గ్రామసింహమెపుడు కనునెసింహపుపిల్ల
చిద్విలాసలింగచిన్మయాంగ 91

శివునిపూజసేయచింతలన్నియుపాయు
చిత్తమందు నిలుప శివునినెపుడు
శివునికరుణతోడచిత్తశాంతియుకల్గు
చిద్విలాసలింగచిన్మయాంగ 92

గురునికృపతోడగుర్తెరుగుశివుని
గురునిసేవజేయగోప్యమెరుగు
గురునివిడిచియెవరుగోప్యమెరుగలేరు
చిద్విలాసలింగచిన్మయాంగ 93

గురుని కరుణ యున్న గుహనచీకటిసున్న
గురుని కరుణ యున్న గుటియు తెలియు
గురుని కరుణ లేక గుడ్డివారగునెప్పుడు
చిద్విలాసలింగచిన్మయాంగ 94

గురువుయనగనెవరుగుర్తింతుమెటులన
శత్రుజయమునొందుశాంతియుతుడు
యాశనణచినడుచుయజ్ఞతతొలగించు
చిద్విలాసలింగచిన్మయాంగ 95

సర్వశాస్త్రములనుచక్కగాచదివించు
సర్వవిషయములనుచక్కజేయు
సర్వరోగహరణి సర్వజ్ఞుపాదంబు
చిద్విలాసలింగచిన్మయాంగ 96

ధనముధైర్యగుణముధరనుగురుడెయగు
విద్యనిచ్చుపెంచువిలువనెపుడు
గురునికరుణయున్నగుడులుతిరుటేల
చిద్విలాసలింగచిన్మయాంగ 97

సర్వ సమయ మందు సర్వక్షేత్రములందు
మూడులోకములనుముఖ్యుడితడు
యతనితోడతెలియుయాత్మ తత్త్వమునంత
చిద్విలాసలింగచిన్మయాంగ 98

భయమునుతొలగించుభద్రమ్ముకలిగించు
తొలగ జేయు మదిని దుఃఖములను
యిహపరములగురునియిచ్ఛయేనడచును
చిద్విలాసలింగచిన్మయాంగ 99

యోగములనుతెలిపియోగ్యతకలిగించు
బుద్ధి కలగ జేసి భోగమిచ్చు
యిహపరమునుతెలిపిశిక్షించుగురుడెప్డు
చిద్విలాసలింగచిన్మయాంగ 100

మంత్ర విద్య నిచ్చు మర్మములతెల్పును
యన్నివిద్యలిచ్చు యమలుడతడు
గురునిపాదధూళిగూర్చువిజ్ఞతనెప్డు
చిద్విలాసలింగచిన్మయాంగ 101

శిష్యుడనగనెవరుశిష్యుడెట్లుండును
తనదియేమిలేదుతలపగురువెయన్ని
యనుచుతలచువాడుయసలుశిష్యుడగును
చిద్విలాసలింగచిన్మయాంగ 102

విద్యనేర్వవలెనువినయముండవలెను
తలువవలయుతల్లిదండ్రినెపుడు
తగనుగురుడెశిష్యధనమనెంచవలెను
చిద్విలాసలింగచిన్మయాంగ 103

హస్తమందునిన్నుయమరగనుంచియు
మనసుమాలజేసిమాయతొలగ
చూస్తుజపముజేయుచుండెదకావుము
చిద్విలాసలింగచిన్మయాంగ 104

శివయనితలచచింతలుతొలగింతు
భవయనతలచబాధతీర్తు
మోహనాశయనగమోక్షమునిత్తువే
చిద్విలాసలింగచిన్మయాంగ 105

సర్వకర్మలన్నిచక్కగాచేయించి
సర్వధర్మమర్మసరళిదెల్పి
కాంతినిచ్చిమదినశాంతినికలిగించు
చిద్విలాసలింగచిన్మయాంగ 106

భావమందునిలచిపాపమ్ముతొలగించు
నిష్టతోడతలతునిలువుమదిని
యిష్టలింగమునికయింపుగపూజింతు
చిద్విలాసలింగచిన్మయాంగ 107

కొలుతునిన్నుకన్నకొడుకునికాంచగ
ధైర్యమిచ్చియిమ్మధనమునెపుడు
శత్రుపీడతీసిశాంతినికలిగించు
చిద్విలాసలింగచిన్మయాంగ 108

కౌండిన్యసగోత్రోద్భవుండగు ములుగునాగలింగారాధ్య
ప్రపౌత్రుండును విశ్వనాధారాధ్య పౌత్రుండును
దుర్గాప్రసాదారాధ్యపుత్రుండునుహనుమకొండ
వాస్తవ్యుండును యగుములుగు విశ్వనాథారాధ విరచితం.

12-09-2010